అడిగెనేనిఁ దాను శిశోదియాన్వయంపు
క్షత్రియకుమారి కాదు తార్కాణమిదియె ! 56

ఇంతయేల? తమ తమ భర్తలసంగరరంగంబుల కనిపి వారివిజయముంగూర్చి యనుమానము కలిగిన వెనువెంటనే పవిత్రులగు రసపుత్రశుద్ధాంతఃపురకాంత లెంతమంది నిర్భయముగా, నిర్లక్ష్యముగా, భగభగ మండుచున్న యగ్నికుండములంబడి తమ ప్రాణములం దృణప్రాయముగా నాహుతిచేసి యతిపవిత్రంబగు జహరవ్రత మాచరించి నిజమానరక్షణము చేసికొనుటంగూర్చి నీవు వినలేదు. నేను నట్టివంగడంబునం బుట్టినదాననే సుమీ!

అక్బరు—ఓసీ బేలా ! ఇవియన్నియు నేనెఱుంగని సంగతులుకావు. నీవును నన్నెఱుంగనిదానవుకావు. కావున నిఁక నెందుకు సందియము. ఇదిగో యీసారంగమార్గమున మన యంతఃపురమునకుం బోవుదముగమ్ము. ఇఁక జాలముచేసితివా నేఁడు బలాత్కారము తప్పదు.

కమలా—ఏమీ ! నీ మొఱకుఁదనము. ఇంతచెప్పినను నన్ను సామాన్యస్త్రీవలె నూహించి బలాత్కరింతునని భయపెట్టుచున్నావే. పొరపాటు. నాతండ్రి వీరవర్యుఁడు; నాతల్లివీరమాత ! నేనో వీరకాంతను. నీచేతభంగపడి యూరకుండుటకంత మొక్కవోయిన వంగడముకాదు మాది. కావున నామాటవినుము. ఇప్పటికి మహమ్మదీయచక్రవర్తులలో నెల్ల మిగుల మంచివాఁడవని పేరు సంపాదించియున్నాఁడవు. నీతాతముత్తాతలకన్న నుత్తమతర నీతికోవిదుఁడవనియు ధర్మమూర్తివనియుఁ బ్రఖ్యాతిపొందినాఁడవు. సామాన్యమానవుఁ డెవ్వఁడేనియు నిట్టి యసత్కార్యములు చేసినచో నది లెక్కలోనికి రాదు. నీవు సామాన్యుఁడవు కావు. ఒకదేశపుఁ జక్రవర్తివి. ప్రపంచకమునందన్ని దిక్కులనుండియు లెక్కకు మిక్కిలియగు కన్నులు నిరంతరము నీనిక్కనం జూచుచున్నవి. నీనోటవచ్చుమాట, నీనడచెడి నడక, నీచేయుపని, వేయేల బాహ్యాంతరములగు నీకార్యము లన్నియుఁ జరిత్రకారులు తమ తమ లేఖినులచే లిఖించి శాశ్వతధ్రువములుగాఁ జేయుచుందురు. నీవు గతించినను నీచరిత్రము మాత్రము గతింపదు. ఇట్టిదౌర్జన్యముల కొడిగట్టిన నీజీవితచరిత్ర మెంత తేలికయైపోవును ! ఎట్టి పరిహాసములకు పాల్పడుదువు ! నీసొమ్ముఁ దినుచుండుటచే మహమ్మదీయ చరిత్రకారు లిట్టి నీలోపములనే గుణములుగా ప్రశంసింతు రనుకొందువేమో? నిజము నిలుకడపై బయలుపడకతప్పదు. ఓ భారతసార్వభౌమా ! నీకీర్తికొఱకు, దేశముకొఱకు, ప్రజలకొఱకు నిన్ను బ్రతిమాలుకొందును. నామాటవిని, నన్ను

మన్నించి, నాహితములను చెవియొగ్గి, నీహితముకోరి, నీవంశహితముకోరి, నీసంతతి హితముకోరి, ఇట్టి హేయపు, హీనపు, తుచ్ఛపుఁగోర్కె నిప్పటికైనను విడిచి బుద్ధిదెచ్చికొనుము. నీదారిం జనుము. నను బోనిమ్ము. దారిలో లెమ్ము (పోవుచుండును)

అక్బరు—(దారికడ్డముగావచ్చి) సుందరీ! ఈనాలోజామహయలో నాకిట్టి మ... రానే వచ్చినది. ఇఁక నిన్ను విడిచిపెట్టువాఁడను కాను. ఆగుము (అరికట్టున...

కమలా—ధూర్తా! తొలఁగుము. నీకట్టికోర్కెలుండిన వేశ్యాకరితోఁ దీర్చికొనుము

ఉ. నందలు వేలునుందురు సెబాసని నిన్వలపించువారు న
న్నెందుకు బాధపెట్టెదవు; నీసిరి రాజ్యముఁ జూచి యూఁకు వా
రెందఱు? నీకుఁ గాంత లరుదే, పరకాంత నను న్గలంచ కో
మందమతీ! నశించెదసుమా విరుమా వనితార్తి సోఁకినన్. 57

అక్బరు—ఓ యిట్టి శ్రీరంగనీతులు నేను నెఱుంగుదును. (వినిపించుకొనక ... వచ్చి కొంగుపట్టుకొనును.)

కమలా—(తప్పించుకొని పెనఁగులాడి దూరముగా నిలిచి) హా! భక్తవత్సల...! ... జనమాన సంరక్షిణీ! కాత్యాయనీ!

పాదప. హైమవతీ! మగనాలను దీనన్
కామవశ రాద్చులు కిన్నులు గప్పన్
పాముకుఁ డక్బరు బల్మినిఁ బట్టన్
గా మది నొచెను గావుము దేవీ!. 58

అక్బరు—నీదయ్యములు, సైతానులు ఢిల్లీశ్వరు నాప నేరవు. (పట్టుకొన బోవును.)

కమలా—క. ఏను పతివ్రత నేనిన్
నానాథుఁడె దైవమని మనంబున నెపుడున్
నే నిమ్మఁగొలుతు నేనియు
నీనీచుం డిపుడు శక్తి హీనుం డగుతన్. 59

(సారంగములోనుండి శక్తి ప్రత్యక్షమగును. అందఱు స్తంభులగుదురు. అక్బరు మూర్ఛపడి యుండును.)

శక్తి—పుత్రీ! ఇదే యసిపుత్రిక. దీనిచే భవన్మానసంరక్షణము గావింపుము (కత్తియిచ్చును.)

కమలా—(త్రుచ్చుకొని వీరావేశముతో) ధూర్తా! ఇకనైన బుద్ధితెచ్చుకొని తొలఁగి పొమ్ము. లేనిచో నాకత్తి నీమస్తుక ను త్తరింపఁగలదు.

అక్బ—(తనలో) ఆహా! ధర్మమునకు దర్పమునకు నిదియేఁదావాసి! (పైకి)

ఉ. దర్పముచే నసాధ్యరిపు తండము గెల్చిన నేఁ గోరఁగాఁ
గూర్పఁగరాని దేది యసిక్రొవ్వి మదించుచున్న నాకిటన్
నేర్పితివో సతీ! మఱువ నెరసి పాఠము; ధర్మవేదినన్
దర్పమొకర్ప లేదెదియుఁ దథ్యము, తథ్యము, తథ్యమిద్దియే. 60

సతీతిలకమా! క్షమింపుము! ఇదిమొదలు నీవునాకు సోదరివి. ఒక్కనీవేకావు. మా శిశోదియావంశసంజాతలగు రసపుత్రికా శిరోమణులందఱు నాకుఁదోఁబుట్టువులే. మీ వంశపవిత్రతను బరిశోధించుటకే నేనిట్టి పనిచేసితిని. ఈచిడిముడి నీకడుపులోఁ బెట్టుకొనక నన్ను మన్నింపుము. (తెరజాఱును.)

## 6. రంగము—ఢిల్లీనుండి యుదయపురమునకు వచ్చుమార్గము.

[కమలాబాయియును బాణభట్టును బ్రవేశింతురు.]

కమలా—ఆర్యా! నేనీయుదయపురములో నాలుగుపూట లాగెదను. ఇప్పటిలో వారిమొగము చూడఁజాలను.

బాణ—దేవీ! ఏమట్లు సంకోచింతురు! విజయగర్వముతో మీరుభర్తగారిసందర్శనము చేయవచ్చును. రాణావారును ఈవృత్తాంతము విన్నచోఁ దమసోదరి నభినందింతురుగాని నిందింపరు. సమస్తభారతసార్వభౌముండగు నక్బరంతవానిఁ దృణీకరించి క్షణములో మంచిదారికిఁ దీసికొనిరా మీరుఁగాక మఱియెవ్వరికిఁదగును!

కమలా—ఆర్యా! లోకులు కాకులవంటివారు. వారి కీలోపలి సమాచారమంతయు నెట్లుగోచరంబగు!

బాణ—గోచరముకాకేమి? ఒకవేళ నీలివార్తలు గాలిలో వ్యాపించినను నిజము నిలుకడపై బయలుపడక తప్పదు.

కమలా—అందుకొఱకే నాలుగుదినము లిక్కడనాగెదనంటిని. మీరుమాత్రి మీద్రవ్యమెట్లయినను వారికందఁజేయవలయును. నాసొత్తని చెప్పిన మాయన్నగారు పరిగ్రహింపరు. స్త్రీధనము! అందులోపుట్టినింటియాఁడుబిడ్డవిత్తము! కావున మీరు వేఱొకరిదని చెప్పుఁడు.

బాణ—చిత్తము. కాని మీ రీపట్టణమువ నెక్కడబసచేయుదురు?

కమలా—రాజనగరునకుఁబోను. ప్రచ్ఛన్నముగ నుందును.

బాణ—చిత్తము. ఒకవేళ మోహినీబాయిని సాగరజీప్రభృతు లిచ్చటికిఁ దీసికొని వచ్చినయెడల నామెవిషయమై కొంచెము కనుగలిగియుండఁగోరెద. చంద్రికళ యిక్కడనే యున్నదఁట. సాగరజీ దానిని బెండ్లిచేసికొనునఁట. చూచుచుండుఁడు! విని కని యెఱుఁగని విడ్డూరములు మనయుదయపురములో త్వరలో జరుగనున్నవి.

కమలా—సరే! నేనును వానినారయుచుందును. అగత్యమైన తత్క్షణమే మీకెఱిఁగించుచుందును.



4. రంగము—కుటుంబముతో ప్రతాపుఁడుండు గుహాముఖము.

[ప్రతాపపృథ్వీరాయ లొకచెట్టునీడను బండఱాతిగద్దెపై విశ్రమించి యుందురు.]

పృథ్వీ—ఆశ్చర్యము! రాణావారిముఖమునం దెన్నఁడు లేని విచారము ద్యోతకమగుచున్నది!

ప్రతా—ఆర్యా పృథ్వీరాయా!

ఉ. జంకును గొంకు లేని పటుశౌర్యధనుల్ రసపుత్రులే నిరా
తంకముగాఁ దురుష్కరచితంబగు సాంకిలిన్ సువర్ణపుం
గంకణమట్లు దాలిచి సుఖంబున నెంతయుఁ గుల్కుచుండఁగాఁ
గంకణముల్ కనుంగొనలఁ గాల్వలు గట్టవె కీర్తికామికిన్. 61

పృథ్వీ—ప్రభుచంద్ర! నేనొక్కమాట యాడెద. కోపగింపరుగదా!

తే. గీ. మహితసంగునకుఁ మీకు మధ్య భీముఁ
డుదయసింహుఁడు పుట్టక యుండెనేని
మ్లేచ్ఛసర్దార్లు తమకు సేవింపఁ గొలుచు
దీనగతి పట్టియుందునే దేశజులకు! 62

ప్రతా—ఇందు కోపకారణమేమున్నది. అంద అనుకొనుమాటయే. దానికేమి? రాజధానివిశేషములేమి? పాదుషాయొద్ద మనవారిచనవు మనవు లెట్లున్నవి?

పృథ్వీ—రాణావారెఱుంగని సంగతులేమిగలవు నానోట విననలతురేని మనవిచేసెద.

సీ. సోదరి వర్జించి ఘామసాదియ గాంచి
మానసింగు గతాభిమానియయ్యె
యవనులతో వియ్యమంది వింతలు పొంది
మాలదేవుఁడు పచ్చిమాలఁడయ్యె
సుతమానమమ్మి విస్తృతరాజ్యముం గొని
కళ్యాణమల్ల మాంగళ్యుఁడయ్యె
కులసతిమానంబు కుష్రోజు పాల్వేసి
రైసింగు కులయశోభ్రష్టుఁడయ్యె
పేరు మోసిన రసపుత్రవీరులెల్ల
స్త్రీలమానంబుఁ దురకల పాలుచేసి
మురియుచున్నారు కానంత పరువుపోక
పరువుఁ గోరెడువారికే బ్రతుకులేదు. 63

పరితా—సరియే. ఇవన్నియు విన్న సంగతులే. కాని ఆర్యా! వీరాధివీరులని పేరుపొందిన వారుగదా మీరిప్పుడు పేర్కొనినవారు. ఇట్లు పౌరుషము జారఁబుచ్చుటకుఁ గారణమేమయియుండునో?

పృథ్వి--కారణమా! (నిందాగర్భముగా.)

సీ. రాజ్యభారంబు దుర్భరమంచు నొదల
వైచి మ్లేచ్ఛుల కప్పగించినారు
కాసులకొరకుఁ గష్టమంచు ధనంబు
మొగలఖజానాలఁ బోసినారు
స్త్రీలమానముఁగానఁ జాలమేమోయని
తురకజనానాకుఁ దోలినారు
రణరంగమందు దుర్మరణమేల యటంచు
నెంచి యక్బరు నాశ్రయించినారు




గీ. పిఱికికండయె లేనట్టి బిరుదుమగలు
రాజపుత్రకు లిన్ని కారణములెన్న
దీర్ఘకాలస్వతంత్రప్రదీప్తి గోసి
పారతంత్ర్యంబు చవిఁజూడఁ గోరినారు. 64

ప్రతా—సెబాష్! పృథ్వీరాయా! చక్కఁగాఁ జెప్పితివి. అక్బరు తనవెనుక రాజ్య మెవరి కీయనున్నాఁడో?

పృథ్వీ—సలీమున కీయవలెనని యక్బరునకున్నది. వానినెట్లయినను దాగ్రిగుంబోతుఁజేసి తన మేనల్లుఁడగు ఖుస్రూనకిప్పింపవలయునని మానసింగు భగీరథప్రయత్నములు చేయుచున్నాఁడు. కాని సాఁగదు.

ప్రతా—సాఁగకేమి? అక్బరున కతసిమాట గురుపదముఁ కే.

పృథ్వీ—ఎక్కడైన బావగాని యిక్కడమాత్రము కాఁడు. అతఁడు పరమ లౌకికుఁడు.

ప్రతా—మానసింగిప్పు డెక్కడనున్నాడు?

పృథ్వీ—సలీముతో వెడలి రత్నపూరు ముట్టడించుచున్నాఁడు. తత్కారణ రహస్యము మీరెఱింగియే యుండవచ్చును.

ప్రతా—ఎఱుఁగుదును. ఎఱిఁగి తత్ప్రతీకారము చేయుచునేయున్నారము.

పృథ్వీ—ఇఁక నొక్కసంగతి దేవరవారి నడుగ సంకోచించుచున్నాఁడను.

ప్రతా—సంకోచమేల? నిరభ్యంతరముగా నడుగవచ్చును.

పృథ్వీ—(చెవిలో నేమోచెప్పును.)

ప్రతా—ఓయీ వెఱ్ఱిబావా! నేనక్బరును శరణువేడి యుద్ధమునకుఁ గొంచెము కాలావధిఁ గోరితినా? ఎవరన్నారు! ఈ త్తది నాస్వభావమెఱుఁగని దొసంగున మాన సింగు ప్రభృతులు నమ్మిరేమో! సర్వమెఱిఁగిన నీవెట్లు మోసపోయితివోయి?

చ. జననము నొందినాఁడనఁట స్వచ్ఛతరంబు శిశోదియా కులం
బుగ, రిపుహస్తిసింహబలబొప్పఁ డమీరుఁడు మాకువంశ భూ
షణుఁడట, సంగరాణ రిపుజైత్రుఁడు నాకగు తాతయంట, మ్లే
చ్ఛపదు శిరంబునందుమునె తుంవ్రసుఖంబుఁకై మొకప్పుడుఁగా.

పృథ్వీ—దేవా! మీరంతకన్న నధికులే. నిజము మనవిచేయుదు. చిత్తగింపుఁడు.

మ. కులమర్యాదలు మేము గోల్పడిన సద్గోత్రంబు నిల్పంగ ని
ర్మలబీజంబు త్వదీయవంశమున నే ప్రార్థించుచుగా యంచు పు

ట్టైన నాసంగొని యున్నవార మికఁ మీరే కీర్తిఁగోల్పోవ నే
జలధిం జొత్తుము రాజపుత్రకులశౌచంబంతటఁ దీఱదే. 66

ప్రతా—ఆర్యా! నాబొందెలో ప్రాణముండ, నాబుద్ధి యీబొందెం బొందియుండ లోకనిందితంబగునట్టి పనిపుట్టదు. అదియేమి? చేతిలో నేమో యున్నట్లున్నది.

పృథ్వి—ఇదియొక యుత్తరము. దేవరవారికొక రసపుత్రసామంతుఁడు శ్రేయోభిలాషి యను మారుపేరున వ్రాసియున్నాఁడు.

ప్రతా—ఏదీ! దయయుంచి చదువుము.

పృథ్వి—చిత్తము. (ఉత్తరముతీసి యిట్లు చదువును.)

దండకము—శ్రీమన్మహారాజ! చిత్తూరుసామ్రాజ్యలక్ష్మీమనః
పద్మమిత్రా! పవిత్రోర్విరాసారవత్ భారతీమాతృగర్భంబునం
దుద్భవం బొందు పుణ్యంబు గన్నట్టి హిందూజమీందారి బృందమ్ము
నాదర్శిగా మిమ్మునే నమ్మియున్నార మంబర్ పురాధీశ ము
ఖ్యాదిభూమీంద్రులు స్వీయ వారంచు మం బేరుకోనేల పెద్దవ్వ వీరాధి
పుల్ కులాచార మర్యాదలన్ వాసి కాసించి పోఁద్రోసి మాయాంస
తల్లన్ నిరాశల్ పొనర్పన్ ప్రతాపా! భవత్కీర్తి నే నమ్మియున్నార
ముద్యత్ప్రతాపా! మహాసంగరాణా! హమీర్ బప్పరావల్ జగజ్జేత
విఖ్యాతమూర్తుల్ చిరస్థాయిగా నింక స్థాపించి యున్నట్టి సత్కీర్తిడిం
డీరముల్ సప్తవారాశిత్రోయంబులన్ నాట్య మాడంగ నేఁడక్కటా!
దిక్కులేనట్టు లీరాజపుత్రుల్ స్వవంశాభిమానంబు పోనాడి స్వస్త్రీ
లపావిత్ర్యముల్ మానముల్ లజ్జనాకోటులో మ్లేచ్ఛసర్దార్ల పాల్సే
యుచున్నారయో మొన్నమాజ్ఞాతి రైసింగు భార్యాచరిత్రంబు విన్నట్టి
యేరాజపుత్రుండు దామూఁతిపై మీసముల్ పూని మోమెత్తఁగా
నేర్చు మాగౌరవంబుల్ ప్రతిష్ఠల్ సదాచారసంపత్తు లీరీతిగా నగ్గిలో
బుగ్గిగా నౌదుమమ్మా! యటంచున్ స్వగర్భంబునం గన్న కూఁతుండ్ర
నుం గట్టుకొన్నట్టి యిల్లాండ్రఁ దోఁబుట్టులన్ సంతలోఁ బెట్టి తన్మాన
ముం గొల్లగా నమ్మి యార్జించుకొన్నట్టి విత్తంబునం బొట్ట పోషించుకొం

చు న్మదం బొందుచున్నార మీవంశమం దొక్క మీరే కులాచార
మిందక్క రక్షించియున్నారు, రక్షించుచున్నారు, రక్షింపనున్నారు;
సుక్షత్రియా! పూతచారిత్ర! మీశీల సౌందర్యతుల్యంబుగా నెంచు
కొంచుం దమిం జేయు నాచిన్ని విజ్ఞాపనం బున్నదాలింపుఁడీ! సుప్ర
సిద్ధంబు సన్మానసంపత్సమృద్ధంబు నిష్కళంకంబు మీవంశపున్
సాంప్రదాయం బయో! నేఁడు నౌరోజ్ బజార్ లోపలన్ బెట్టవద్దం
చు వేమాఱు ప్రార్థించెదన్ సర్వసంపత్తియున్ లౌకికోద్యోగ సద్యోగ
చిహ్నంబులున్ నశ్వరంబుల్ సదా శాశ్వతంబై మనుంగీర్తియొక్కండ
యో! సర్వసర్వస్వముం గోలుపోవన్ స్వదారప్రజానీకమున్ దైన్య
మొందన్ మహాఘోరదారిద్ర్యదుఃఖంబు నేఁ బొందుచున్నానటంచు
న్విచారింతురా! మీకు నిప్పట్టునన్ నష్టమైనట్టిదెల్లన్ యశోవృద్ధిచే
రెట్టియై నట్టుగా నెంచుఁడీ, నేఁడు పేరాసచే మ్లేచ్ఛసంపర్కసంతోషి
తస్వాంతులై పొంగుచున్నట్టి యీరాజులే వచ్చి మీకాళ్ళపై వ్రాలి
మాజాతి మాకీయుఁడీ! మాబహిష్కారముం బాపుఁడీ! యంచుఁ బ్రా
ర్థించుకాలంబు దూరంబుగా లేదు; మేవారువీరాంతరంగాగ్నిభూమీధ్ర
గర్భంబుల న్నిద్రితావస్థయం దున్న శౌర్యోగ్రగంధాశ్మవాతాగ్నులం
బ్రజ్వలింపింప మీఖడ్గధారామహద్ఘర్షణం బొక్కటే తక్క వేఱొ
క్క దిక్కెద్దియున్ లేదు మమ్మాఁటికిన్ మిమ్మునే నమ్మియున్నార మో
బప్పరాయాన్వయా! కార్యదీక్షాప్రపూర్ణంబు మీచిత్తమున్ స్వ
సద్గారవాసక్త మావృత్తమున్ వజ్రవజ్రాయుధం బేని నిర్జింపఁగాఁజా
లు మీచేతి ఖడ్గంబులే ముఖ్యసాహాయ్యకర్త్రుల్ సహాయంబు వేఱొం
డు లేదంచు శంకింపఁగాఁ బోకుఁడీ! ధర్మ మెచ్చోఁ జెలంగున్ జయం
బందు తథ్యం బటంచు న్వినన్ లేదె భూమీధవా! ఘామసా నేము సం
గ్రామకాలావధిం గోరినా రంచు నేకింవదంతి న్వినంగల్గుటం జేసి మిమ్మిం
త ప్రార్థింపఁగా వ్రాసితిన్ దైవమే మీకు సాహాయ్యమౌఁగాత మీ

ఖ్యాతి రక్షించుతన్ శత్రురాడ్మర్దనా కీర్తిసంవర్ధనాంగా జయస్తే!
జయస్తే! జయః! 67

ప్రతా—ఆర్యా! ఎవరువ్రాసిననేమి? కవితాబద్ధమగు నీయుత్తరముం గనినంతనె నాకు వేయేనుఁగుల సత్తువవచ్చినది. చూడుఁడు. ఈమాటలచేతనే,

మ. జయలక్ష్మిన్నలరింతు నీక్షణమ, రాజస్థానసుక్షాత్ర భూ
జయశశ్శంఖలలర్పవర్ష ఘనఘోషల్ నాఁ జెవింజొచ్చె న
న్నియు ఢిల్లీశ్వరుఁడేని నన్నెదురనీ, నేఁడే చిరస్థాయిగా
జయశాలీయని పాఁతినానిదె జయస్తంభంబు మేవారునన్! 68

పృథ్వి—జయము! జయము! మహారాణావారి ప్రతిజ్ఞ యప్రతిహతమగుఁగాక!

భామ—(ధనపుఁ బెట్టెలతో ప్రవేశించి) జయము. జయము. మహాప్రభూ!

చ. జయము! ప్రతాపభూప! తమసన్నిధికంపె ధనంబు యుద్ధపుం
వ్యయమున కాఱుకోటులు సువర్ణము లివ్వియె!

పృథ్వి— ఎవ్వరా యుదా
రయశులు?

భామ—పూర్వపున్ సచివరత్నము భామసి!

ప్రతా— మంచిదే! రణ
వ్యయమొనరింపుఁడీ! యిపుడెపంపుఁడిమంత్రికిమన్నమస్కృతుల్.

పృథ్వి—కవిశిరోమణీ? ఈధనము మనకెంతకాలము వచ్చునో లెక్కవేసి చూచితిరా?

భామ—చిత్తము! ఇరువదివేల సైన్యమునకు పండ్రెండు సంవత్సరములకు-

ప్రతా—సరియే! విత్తపుమొత్తముమాట కేమిగాని యుపశ్రుతి మన కత్యంతోపకృతి చేయుచున్నట్లున్నది. ఇఁక మహూర్తము స్థిరపఱ్చుకొని జైత్రయాత్రకు వెడలుటయే తడవు. ఈవిత్తమా యుత్తమగు సెల్వున భద్రపఱ్చుఁడు. రండు! లోనికిఁబోవుదము. (అందఱు లేవఁగా లోనితెర యెత్తఁబడును. లోపల ప్రతాపుని బిడ్డలును భార్యయు విశ్రమించి ప్రసంగించుచుందురు.)

కమల—అమ్మాజీ సర్కార్! రత్నపూర్ సమాచారము లిటీవల నేవయినఁ దెలిసినవా?

కరుణా—లేదమ్మా! పాపము! కుక్షింభరుఁడగు నల్లుని మూలమున రత్నవల్లునకు ముసలికాలమున మిక్కుటములగు చిక్కులు రానైయున్నవి.

కమల—అమ్మాజీ! పాప మక్కయ్య మోహినీబాయి యిప్పు డెట్టి యవస్థయం దున్నదో గదా!

కరుణా—ఏమియుఁ బ్రమాదము రాకూడదు.

అమర—భయములేదు. సింహవిక్రముఁడగు జయసింహుఁ డామె రక్షణకై పోయియుండెను. ఆమె వానినివరించి కంకణముఁగూడఁ బంపియుండెను గదా! తన్నే నమ్మికొనియున్న కన్యాశిరోమణి రక్షణ నుపేక్షించుటకు మనజయసింహుఁ డంత మగటిమిలేనివాఁడు కాఁడు. అదిగో బాబాజీగారు సమిత్రబాంధవముగా నేవియో పెట్టెలు పట్టించుకొని యిందు విచ్చేయుచున్నారు. మీరు లోనికరుఁగుఁడు. (కరుణాదేవియును కమలయును లేచి లోనికరుగుదురు. అంత ప్రితా సాదులు పూర్వోక్తరీతిని బ్రవేశింతురు.)

పృథ్వి—అబ్బా! ఈగుహాంతర్భాగము పోవుట కెంతదుస్తరముగా నున్నది! ఒక్కమానిసియేనియు ధారాళముగాఁబోవుటకవకాశమున్నట్టులేదే!

ప్రితా—ఆర్యా! చిలుకపిల్లలను పిల్లులు మొదలయినవాని బారిఁబడకుండఁ బంజరములోఁబెట్టి రక్షించుచుండుట యెఱుఁగుదువుగదా! భయావహంబగు ప్రస్తుతప పాలనంబునను నట్టే మనపిల్లలను మ్లేచ్ఛసైనికశార్దూల జాలము వాతఁబడకుండనట్టి గుహాపంజరములలోఁబెట్టి బంధింపవలసి వచ్చెను.

పృథ్వి—ఆర్యా! ఇట్టికష్టములు తమవంటికీర్తికాములకు మాత్రమే గదా!

ప్రితా—అవును. ఏధనముఁ గోల్పోయినను మానధనముమాత్ర మిట్టిపెట్టెలలోఁబెట్టిమే కడుభద్రముగా రక్షించుకొనుచున్నాము. ఆర్యా! భద్రము. ఈయడ్డబండ నానుకొని కడుజాగ్రత్తగా నీబండఱాతిపైఁ గాలువేయుము. కాలుజాఱిన పాతాళముఁజొచ్చియున్న యీకొండకాలువలోఁతు చూడఁగలవు.

బాణ—ఆర్యా! చేయూఁత యొసంగుదునా!

పృథ్వి—వలదు. వలదు. నేనే మెల్లఁగా దాఁటెదను. (దాఁటి) అబ్బా! నేటికి ప్రమాదము తప్పినది. (అందఱు గుహాలోఁ బ్రవేశింతురు.)

ప్రితా—ఆర్యా! పృథ్వీరాయా! తిలకించితివా మాసంపత్తి?

శా. సత్పుణ్యాగ్రప్రభఁ బుష్టిభోగులయి రాజ్యశ్రీసుఖంబొంది సం
పత్పూర్ణానుభవ ప్రమోదములు గూర్పరాజులు మేరారు భూ
భృత్పుత్రుల్ గద వీరలీకరణి దారిద్ర్యంబు ప్రాప్తింపఁగా
మృత్పాత్రంబులఁ దొట్టెయుయ్యాలల బాళింబోవుటం గంటివే.

పృధ్వీ—మహానుభావా! ఇదియొక లేమి కాదు.

మ. అభిమానంబును మానము న్యశము మ్లేచ్ఛాధీనముం జేసి శ్రీ
లభియింప న్మదమొందు మాదృశిరియేలా, కాల్పనా, సద్యశ
శ్శుభసంధాయకమౌ రమున్నిలిపి నీచుల్గోరు కాలాగ్ని స
న్నిభమౌ ద్రవ్యము జాఱఁబుచ్చితివహా! నీకేవి దారిద్ర్యముల్.

ప్రతా—ఏమో మీరందఱి ట్లభిమానించుటయే మాకుఁ గావలసినది. మిత్రులారా! రండు విశ్రమింపుఁడు. కవిశిరోమణీ! ఢిల్లీపురవిశేషము లేమి?

బాణ—ఢిల్లీవిశేషములు విశేషముగానే యున్నవి. మొన్న నౌరోజామహోత్సవములో నొక విచిత్రము జరిగినది. పవిత్రక్షత్రియవంశ సంజాతయు పతివ్రతా శిరోమణియు నగు రసపుత్రకాంత యొకర్తుక యందందఱు స్త్రీలే యుందురుగదా యని తనభర్తగారి యనుజ్ఞ నంతకుముందే పొంది యుండి కుతూహలముచేత నుత్సవము చూడఁబోయినది. అందక్బరు స్త్రీవేషమును ధరించి సంచరించుచుఁ దొలకరి మించుం దృణీకరించు నామించుబోణి మేనిహొయలు గాంచి మించువిలుకానిచే నంచితుండై-

మ. అరికట్టం జెడుబుద్ధి నాసతిసుసాధ్యంబౌను నూహించి సు
స్థిరసాధ్వీమణి దైవదత్తమగు కత్తిం దీసి ఝుళిపించి ము
ష్కరుఁడా! రా యిఁక నంటుచున్న నిన పశ్చాత్తాపతప్తాత్ముఁ డ
క్బరుతుమ్మోహ్యాస్మియటంచుఁ దానరిగెఁ దత్పాదంబుల వ్రాలుచున్.

ప్రతా—సెబాస్! సెబాస్! వీరపత్నీవంశసహజంబగు పని చేసితివి.

పృధ్వీ—హాయి! హాయి! కాంతాశిరోమణీ! నిను గట్టుకొన్న యాతఁ డెంత ధన్యుండై యుండఁబోలును.

ప్రతా—ఎవరోయి జగత్కీర్తనీయ కీర్తిశాలిని యగు నాపతివ్రతాశిరోమణి?

బాణ—అట్టివారు వీరశిశోదియావంశమునఁ గాక యెందుఁ బుట్టనేర్తురా. ఆసాధ్వీమణి దేవరవారి సోదరి కమలాబాయి దేవిగారు.

పృధ్వీ—ఏమేమి? కమలయా! నీ ముఁదక్క రెంతపని కొడిగట్టెను? ఆమె యిపుడెచ్చటనున్నదో?

బాణ—ఇఁకను ప్రాణముండఁగా ఢిల్లీపురప్రమట్టి త్రొక్కనని ప్రతిజ్ఞఁబట్టి యుదయపురముఁ జొచ్చినారు. నేఁడో రేపో యిచ్చటికి రానున్నారు.

పృథ్వీ—దేవా! ఇంతవచ్చినతరువాత వింకను పేక్షింతురా!

ప్రితా—ఉపేక్షయేది? సైన్యములు సర్వసన్నాహములై సన్నిహితముగానే యున్నవి. ముందు కమల్‌మియరు, ఆమీఁద రత్నపురము, పిమ్మట నుదయపురము స్వాధీనముచేసికొనుట కేర్పాటు—

బాణ—చిత్తము.

[అంత ప్రితాపపుత్రుఁడగు నమరసింహుఁ డొక యుత్తరముపట్టుకొని ప్రవేశించును.]

ప్రితా—కుమారా! ఆయుత్తర మెందునుండి?

అమ—జయసింహుని యొద్దనుండి. చిత్తగింపఁదగు. (ఇచ్చును.)

ప్రితా—(పుచ్చుకొని చూచి) కుమారా! మామాజీగారిఁ దోడ్కొని నీవు లోనికిఁ బొమ్ము. కవిశిరోమణీ! మీరు నాతోరండు. ఆర్య పృథ్వీరాయా! వీడ్కొని త్వరలో మరలవత్తును. (పైకిరాఁగాఁ దెరజాఱును. బూరా యూఁదఁగా భిల్లులు మూఁకలు మూఁకలుగాఁ బ్రవేశింతురు.)

పాట—రారే! రారే! మీరా! (పల్లవి)
ధీరప్రతాపు, బూరావినంబడె॥ రారే॥

1. దారుగా కిత్తిక । టారులనూఱించి
దారి మొగలగాసి । వైరులనరికట్ట ॥ రారే ॥

2. తురక మూఁకలజూసి । చెలుకుగెకలలీం
చరుకు చరుకున నరికి । దొంగాఁటకిర్పింప ॥ రారే ॥

3. ఘాటీలు దాటుచో । మీఁటవాలఁబన్ని
బాటపూటకాగఁ మీఁటల వెడలింప ॥ రారే ॥

1. భిల్లు—బాబూ! బాణకవిబాబూ! బుద్ధి బుద్ధి! రాణాగారితో ముందుసామీఁద సెప్పాల. దేవిడీకాడ మామిడైన నక్కపోఁతు ధాకలు సేసికొన్నాను. నిన్ననే మాయిారకోడు మాటొగ్గియేసినాడు.

2. భిల్లు—కవిబాబూ! బుద్ధి బుద్ధి! ఈదొప్పలో యిప్పత్తేనె మాజగిలిఁడొంతు. ఇదిగో యీదొన్నెలోంది సిన్నిపూదేనెనాది. ఆడికింద నాపేరు సెప్పాల బాబయ్యా!

3 భిల్లు—బానయ్యబాబోరూ! బుద్ధి బుద్ధి! ఇదిగో గోరోజనం, కస్తూరి, పుణుగు, జవ్వాజి నజరుపట్టుకొచ్చినాను. పెద్దపెబ్బుగారితో సెప్పాలిబాబూ

బాణ—ఓరీ! భిల్లులారా! మీమీ కానుకలు పేరు పేరువరుసనను దెలిపెదను. కాని మనరాచవారి బలములను, తక్కినవారి నందఱిని రేపిక్కడకు వచ్చునట్లు మీ రున్నపాటున నూరూరు పల్లెపల్లెకుఁబోయి రాణావారిమదలచెప్పిరావలయును. రేపేదర్బారు. ఇదివఱలో మొహానత్ గా పనిచేసినవారి కినాము లీయఁబడును.

భిల్లులందరు—చిత్తం. బాబోరూ. బుద్ధి బుద్ధి. (సమస్కరించి పైపాటనే పాడుచు నిష్క్రమింపఁగాఁ దెర వాలును.)





శ్రీ

# రాజపుత్ర తేజఃపుంజము.

(రాణా ప్రతాప్ సింగు)

## చతుర్థాంకము.

### 1. రంగము—రత్నపూరుకోటలోని ప్రమదావనము.

[మోహినీబాయి యేడ్చుచు జయసింహ ద్వితీయయై విశ్రమించియుండును]

మోహి—హా! దాదా! నామీఁద క్రోధమా! ఒక్కమాఱు నాతో మాటాడరాదా! నీకు దయలేదా! దాదా! దాదా!

జయ—బాలా! ఊఱడిల్లుము ఊఱడిల్లుము ఎంతకాలమిట్లు దుఃఖించిన కలసివచ్చును!

మోహి—మిత్రరత్నమా! మాదాదాను ఆమూషట్టు చెట్టుక్రిందనేగదా మగుడలేవని పాన్పునఁ జవళింపంజేసివచ్చితివి. ఒక్కమాఱుచూపరాదా! దిక్కుమాలిన నాపయి నీకు నక్కటికములేదా! దాదా! హాదాదా!

జయ—రాజపుత్రి! ఇది నీవంటిప్రాజ్ఞురాలికి చెల్లా! చెల్లా! ఒక్కించుకయు ధైర్యము చిక్కంబట్టుము.

మోహి—ప్రియమిత్రమా ఎట్లుచిక్కఁబట్టఁగలను? మాదాదా అందఱు తాతల వంటివాఁడు కాఁడే!

సీ. చిన్నప్పుడే నాకుఁ గన్నతల్లి నశింప
నగ్గువాల్పోసి నన్నోమినాఁడు
కండనా నస్సిట్లు కొండను గావించి
కొంపంగ కొని పొంగు చుండువాఁడు

నాతోఁడిడే యెల్లభూతలం బంచు నా
ముద్దుల చెల్లించి మురియువాఁడు
జవ లేసి తఱి తల్లి చావ్రపిల్లను నన్ను
పొత్తిట నిడుకొని ప్రోచినాఁడు
వినుము నాకింత చీమ కుట్టినను దనకుఁ
దేలు గుట్టినలీలఁ జింతించువాఁడు
నెపుడు నాసౌఖ్యమే మది నెంచువాఁడు
నెనరు గలవాఁడు మాదాద నేఁడు లేఁడు. 78

జయ—బాలా! ఈలీల పనవి పనవి దుఃఖించిన కొంచెమైన లాభమున్నదే?

మ. శతవృద్ధై చనె తాత నీవిటులు సజ్జన్ ఘోరమం చేడ్వ నా
మతిపోవుం గతియేమి? యూఱడిలు లేమా! గర్భనిర్భేద్యమీ
వెతకుం బారముగద్దె, దైవవిధి యుర్విం దప్పనేముందు సం
గతియోచింపఁగవద్దె, యొక్కత్రుటిచిక్కంబట్టుమీ ధైర్యముం.

మోహి—కొండంత తాతనే మ్రింగివేసిన మొండికట్టియను, ఈ దుఃఖము మాత్రము దిగమ్రింగఁజాలనా? ఇదిగో దుఃఖమంతయు నడచిపెట్టి నిబ్బరముగానుంటిని. ఏమిచేయుమందురో చెప్పుఁడు.

జయ—సుందరీ! ఈ మందమతుల మందరి యాలోచనయేమియో నీకుం దెలియునా?

మోహి—తెలియకపోవుటేమి? దుర్గమాక్రమించుకొందురు. అటుపిమ్మట చేఁజిక్కిన నన్నెత్తుకొని ఢిల్లీకో, ఉదయపురమునకో గొంపోవుదురు.

జయ—అది కలలోనిమాటలే! దానికేమి? నేఁట రేపట వారుచేయనిశ్చయించిన కార్యముమాట చెప్పుచున్నాను విను.

మోహి—ఆనిశ్చితమేమి?

జయ—కోట కాల్చివేయుట.

మోహి—కారణము?

జయ—ఎంత వెదకినను మనజాడ కానరాని కార్పణ్యమున.

మోహి—హా! ఎంతపని! (తనలో) రణమల్ రాజచంద్రా! నిశ్చయముగా నీవదృష్టవంతుఁడవు. ఈ దుష్టచేష్టితములు చూడకమున్న నీవారింబట్టితివి. (జయసిం

హునితో) రాజకుమారా! ఏమీ! కోట కాల్చివేయుదుగా? నావిషయమగు తుచ్ఛపు టూహతో నాతండ్రియు మానసింహుఁడును, ఇక్కడ యవనచమూ సమూహముతో నేముహూర్తమున కాలుపెట్టిరో యాగడియయందే కాలిపోయి నదే రత్నపూరుకోట !

సీ. కన్నతండ్రియె యిటు గావించె నని భోరు
మని యేడ్చునాదు శోకాగ్ని చేత
అల్లుఁడే తనయింటి కంతకుం డయ్యెఁగా
యని డిట్టు తాత శాపాగ్ని చేత
కుక్షింభరతఁ గిన్నకూఁతు మ్లేచ్ఛుల కమ్మ
నైయున్న తండ్రి పాపాగ్ని చేత
ఎఱయేదొ చూపిసోదరుఁ జీల్చినద్రోహి
యా మానసింగు దోషాగ్ని చేత
దగ్ధమైపోయె నీకోట తనర నాఁడె
మ్లేచ్ఛు లిట నేక్షణమున కాల్పెట్టినారొ
బొగ్గుమాత్రంబె మిగిలె నిప్పులనునార్పి
సంచయనకర్మ తగునింక సాగరునకు.

అయ్యో! దాదాజీ! అపారానిధైయెంత దిగమ్రింగినను సముద్రతరంగముల భంగి తెరతెరలుగా పొంగి పొంగి పొరలివచ్చు నీయగాధ బాధ నెట్లు భరింతును. ఈయపార విచారపారావార మెట్లు తరింతును! హా! దాదా!

చ. బ్రతికితి నెన్నఁడేడు లిలపైఁ గులగౌరవ మొక్కనాఁడునున్
వదలక చీకుకామమున నాకతన న్వెతగల్గె, ప్రాణముల్
హృది కరమంచి నిర్మలతనీఁగెడు సౌఖ్యము లేకపోయె నేఁ
గద కత మూన్ప్రధావ్యధకుఁ గాల్పనె నాతనువింక భూమిపై 76

హా! దాదా! చిన్నతనంబుననే కన్నతల్లి కఱవైపోవ నన్నిటికి నీవయై యేకొఱంతయుఁ జేరనీయక కొండంతాసతో కన్నులఁగద్దుకొని కాపాడుచుండినందుకు నావల్ల నీకుఁ దుదకు మంచిసౌఖ్యమే కలిగినది.

జయ—శాంతామణీ! ఇంత కడుపు పగిలి శోకించుట న్యాయమా! దురంతమగు నీవిచారకాసారమునకు పరీవాహ ముండవలదా! ఇంతకు మీతాతగారు నిశ్చింతగా నస్తమించినారు. ఇఁక శాంతిఁబొందుము.

చ. మగువరొ గడ్డమూని బతిమాలెద నివెత మానుమింక తే
నగునఁటె యెంత మొత్తుకొన నాతని సీతనువుల్ తిరంబు లే
జగమున చావుపుట్టుకలు జ్ఞానుల కొక్కటియే సుఖిగా శమిం
పఁగదె సుధీనిధీ! నతగుణా! తగునా! తెగునా వగందిగుల్! 77

మోహి—శూరాగ్రేసరా! మాదాదాజీగారు తమయవసాన సమయమునఁ దనుతో నేమయిన చెప్పియుండిరా? నేనప్పుడు కార్యాంతరమున లోనికిఁబోయియుంటిని.

జయ—శూరుల కుపదేశింపఁదగిన రహస్యము లనేకము లుపదేశించిరి. తరువాత నీవిషయమును గొంచెము చెప్పిరి.

మోహి—మిత్రరత్నమా! కరుణించి నస్గుటించి దాదాగారేమి వినిపించిరో యానతిచ్చెదరా?

జయ—సుందరీ! సాంతముగాఁ జెప్పవీలులేదు.

మోహి—(చనవుతో) పోనిండు. వీలయినంతవఱకే సెలవిండు. అతికుతూహలమునకు క్షమింపుఁడు.

జయ—సుందరీ! ఇందు క్షమించుటకేమున్నది! వారు నాతోఁ జెప్పినదంతయుఁ జెప్పెదవిను.

ఉ. తల్లి గతింప నీలలనఁ దల్లియుఁ దాతయు నౌచు మల్లికా
పల్లవి నాఁగఁ బెంచితిని; పాతకుఁ డల్లుని వల్ల చేటువా
టిల్లఁగనుండె; నెయ్యెది ఘటించెదొ వత్సుఁడు కీర్తి నిల్ప మా
పిల్లయు రాజ్యమింక విసిపింపఁగ నేరను నీకుఁ బైకథన్. 78

మోహి—(తనలో) అంతటిభాగ్యమా! ఈమందభాగ్యురాలికి. (పైకి) పోనిం డింతవఱకు విన్పించితి రిందులకే కృతజ్ఞురాల. పైరహస్యములు నాకేల?

జయ—సుందరీ! నీవిషయమై దాదాగారు చెప్పిన పద్యోత్తరముం జెప్పివేసితినిసుమా! ఇంచుకంతయు దాఁచియుండలేదు.

మోహి—మీరిప్పుడు "ఇంక వినిపింపఁగ నేరను నీకుఁ బైకథన్" అనుటచే నేమేని దాఁచియుంచిరేమో యనుకొంటిని.

జయ—అదియు దాదాగారు చెప్పినమాటయే. అంతవఱకే వారికి మాటాడుశక్తి యుండె.

మోహి—హా! దాదా! కనుపులోని యూహ పూర్తిగా వెలువరించుటకైన నవకాశము లేకపోయెనా! హా! దౌహిత్రీవత్సలా! ఇంక నేమిని చెప్పియుందువో గదా! దాదా!

జయ—యువతీ! మరల నేడ్పులోనికి దిగితివా! కొంచె ముపశమించితివేని దాదాగారు చెప్పిన పరమరహస్యమొక్కటి చెప్పెద. ఇందాకఁ జెప్ప మఱచితి.

మోహి—ఏదీ! ఏదీ!

జయ—మఱి యూఱడిలుము. (నలుదెసలు పరికించి) ఇందెవ్వరును లేరుగదా! ఆమూ పట్టు చెట్టుగుబురు జొంపములలో గలగల నేదో చప్పుడైనది.

మోహి—(చనవుతో) ఎవ్వరును లేరు. ఏవోపక్షుల ఱెక్కల చప్పుడై యుండవచ్చును.

జయ—పక్షుల చప్పుడట్లుండదు. చెట్టుపై నెవ్వఁడో మనుష్యుని సడియైనది.

మోహి—ఏమానిసి సడియుండగాదు, అబ్బా! నన్నూరింపక చప్పునచెప్పుఁడు.

జయ—సుందరీ! అపాయసమయమున మనమిచ్చటినుండి తప్పించుకొని పైకిఁబోవుట కదియొక సుళువైనమార్గము. ఈకోటపాణిద్వారమునకుఁ బడమటికొమ్మున నొకపుష్కరిణి కలదుగదా! తద్గర్భగతంబగు సోపానములక్రిందినుండి యొక సురంగమార్గము గలదు. తద్ద్వారమునఁ బోను పోను వెల్లడియై యేనూఱుబారల దూరములో నొక నేలమాలియయుం గాలికాలయమునుం గలవు. ప్రస్తుతమచ్చటికిఁ బోవుటయే కర్తవ్యముగాఁ దోఁచుచున్నది.

మోహి—మిత్రరత్నమా! చిత్తము! ఎల్లెనీప్రమాదస్థలమునుండి బయలఁబడినఁజాలు.

జయ—సరే! నేటిరాత్రియే ప్రయాణము. నీనగలను నాణెములను జక్కఁబెట్టుకొనుము.

మోహి—అన్నియు సిద్ధముగానే యున్నవి. మీసహాయమువలన నొక్కనగం గాపాడుకొనినంజాలు. అది యాత్మగౌరవము. అవగను విలువలేదు. తక్కిన నగలు నాకంతలెక్కింపఁ దగినవి కావు.

జయ—కాంతాశిరోమణీ! అంత నిస్పృహ బూనుటకు నీకిపుడువచ్చిన భయమేమియు లేదు. నీగదిలోనికి రమ్ము. నీవస్తువులలో విలువగలవాని నాచేతికిమ్ము. లెమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

గులాం—(చెట్టునుండి దిగి పిఱికితనముచే బెదరి బెదరి చూచుచు) ఆ! అచ్ఛారే! దోనోంకీ చెల్లయూ! పర్వానహీ! మాదీమంచిహాదృష్టమ్. దొంగా దొరికినాఁడు.

పాట—దొరికినాఁడుదొంగ దొరకినాఁడుమాకి.
దొరకినాఁడుచోరు । దొరికినాఁడురా ॥
దొరకిసెప్పిమాను । సరిఖవేయిస్తాము ॥ దొరికి ॥
మెల్లిగా బెల్లించి । మీటీమాటలాడి ।
పిల్ల దాన్నియీఁడు । పెళ్ళాడా సూస్తాడు ॥ దొరికి ॥
హుజూర్కి పోతామ్ । హుషారీ చేస్తామ్ ।
కాఫీర్ దగాసెప్పి । ఖైదూ సేయిస్తాము ॥ దొరికి ॥
(పాడుచుఁబోఁగాఁ దెరజాఱును.)

## 2. రత్నపూర్—కోటనుండి కాళికాలయమునకుఁ బోవు రహస్య మార్గమున

[మోహినీ జయసింహులు ప్రవేశింతురు]

మోహి—అమ్మయ్యో! ఎంతభయంకరముగా నున్నది. అగ్గిరక్కసుండు దుర్గమెల్ల నొక్కగుక్కం గబళించుచున్నవాఁడు.

తే. గీ. శిరమునందుండి ధూమకేసరము లెగయ
మంటలను నాల్కలను జదలంటఁ జాఁపి
చటచటధ్వని దంష్ట్రలు పగులఁజేయు
చగ్గిరక్కసి మ్రింగు సౌధాళినెల్ల. 79

జయ—సుందరీ! భయములేదు. మనము ప్రమాదస్థలము దాఁటి కడుదవ్వు వచ్చితిమి. నా వెనువెంటనే రమ్ము. గమ్యస్థానము సమీపముననే కలదు.

మోహి—ఇదే వచ్చుచుంటి. (కోటవంకఁ జూచి) అయ్యో! సమయమున హోరుగాలి కూడ దాపరించినది. ఆర్పరానిదై యగ్నిహోత్రి మంటకంతకు విజృంభించుచున్నది!

జయ—అవునట్లేయున్నది.

లయవిలాసిని, భుగభుగశిఖజ్వాల, గగనానిలజ్వలిత
ఖగబింబమోయనఁగ, నగరులను గాల్చున్

పొగలెగయఁ గానగ్గి, సెగమాడి మ్రోడువడి
దిగులంది బొగ్గగుచుఁ, బగలగుమి మ్రగ్గఁ
ఖగతతి వగంగూలి, గగనాపగం దటియ
నగునంచుఁ బాఱుగతి నెగులు వినువీథిఁ
భగభగ వియద్వీథి, కెంబ్రాకు మంటసెగ
వగనింపి ఖేచరుల బెగడువడఁ జేయున్. 80

మోహి—ఓహోహో! మ్లేచ్ఛసిబ్బందుల మందు గిడ్డంగి యంటుకొన్నట్టున్నది. ఈ మాఱు జ్వాలాజిహ్వుం డొకంత శాంతించునట్లు లేదు. అగ్నిదేవునకు వాయుదేవుండు సహాయభూతుండు కాఁగా మంటలు నల్దట్టుల నొక్కపెట్టునఁ జుట్టుముట్టినవి. పాపము. రాఁకపోఁకలకు వీలుచిక్కక యవనచమూసమూహం బంతయు నొక్కముహూర్తంబున హుతాశనువాతఁబడునట్లున్నది. జ్వలనా! హవ్యవాహనా! శాంతింపుము. హా! హా! స్కంధావారములందు హాహాకారములు మిన్ను మ్రోయుచున్నవి. శిఖిజ్వాలలు మ్లేచ్ఛశిబిరంబుల దెస క్రేళ్ళు వాఱుచున్నవి.

జయ—దంతిగమనా! వీతిహోత్రుని శాంతింపుమని వేఁడుచుంటి వెంతబేలవు. పలుగాకులకు నీ కాకిమూకలపాటు దెరవులేదనియా విచారించుచుంటివి. ఎంతసత్యకాలము!

తే. ధీరరసపుష్టి నాశప్రదీప్తి నగు
నిన్ను బట్టఁగ వచ్చి రీనీచమతులు
దివ్యోపప్లవ ముద్దిశ దివురుమినుత
యగ్నిఁబడి దగ్ధమౌఁగాక హాయిఁగను నే! 81

వనజముఖీ! మనసైనిక నికాయంబు సర్వంబును మానసింహు కైదుచేసి యుదయపురమునకుం బంపివేసెనంట. పోనిమ్మది యుమేలే. ఇక్కడనే యుంచినచో వీరిపాట్లే మనవారికిని తటస్థించి యుండును.

మోహి—వీరవర్యా! అగ్నిహోత్రుఁ డింకను శాంతించినట్లు లేదు.

జయ—లేదు. లేదు (అగ్నికభిముఖుఁడై కేల్మోడ్చి) హుతాశనా! సర్వభక్షకా! సంపూర్ణాహుతిఁ గొనక శాంతింపవు.

మ. జ్వలనా! కాల్చుము కాల్చుము మిక్కనిట్టుమర్యాద్యపారములూను పా
పుఁబు లేకుండఁగఁ జేయుచూ గొనుము సంపూర్ణాహుతిన్ స్వర్గమున్
ఖలుఁడౌ సాగ్రజి వంశవైరి నొకగ్రుక్కన్ మ్రింగుచూ హాయిమ
న్చుమంగంబోవుము సర్వభక్షకుఁడ నీనోటంబడెన్ పూతుఁడౌ. 82

(ఇరువురు నిష్క్రమింపఁ దెరజారును.)

3. రంగము—(రత్నపురికోటముందటి మైదానము.)

[సాగరజీయును మానసింహుఁడును బ్రవేశింతురు.]

మాన—ఆర్యా! సాగరజీ! ఆజయసింహుఁ డెంతమోసముచేసెను!

సాగ—అతఁడు జయమల్లుని కుమారుఁడుగదా! ఎంత సాహసకార్యమునకైన వెనుదీయువాఁడు కాఁడు. దుర్గదాహము వానిపనియేయని నాయనుమానము.

మాన—కోటకు నిప్పంటించి ఏయర్ధరాత్రిమపుడో వాఁడిందుండి దాఁటివేసి యుండవచ్చును.

సాగ—నాకు నదేయనుమానము. ఏదేని రహస్యమార్గమున వాఁడు తప్పించుకొని యుండవచ్చును.

మాన—కోట నాల్గుప్రక్కలను, ఆమీఁద పట్టణము నాలుగుదిక్కులను మనసిబ్బందులు కనుగలిగి కావలిగాచుచున్నవే. ఎక్కడికిఁ బోఁగలఁడు? ఎట్లుపోఁగలఁడు?

సాగ—జయసింహుఁడు కడునేర్పరి. అతఁడెట్లిందుఁ బ్రవేశించెనో మన మిదివఱ కూహింపఁ గలిగితిమా! ఎట్లుప్రవేశించెనో అట్లే నాఁటిరేయి యుండవచ్చును.

మాన—అయినఁ గావచ్చును. అదే సలీంఖానుమామ దత్యుత్సాహముతో నిటు వచ్చుచున్నాడు.

సాగ—వారి కుత్సాహము లేనిదెప్పుడు! చిదానందపురుషులు!

సలీం—(ప్రవేశించి) మామాజీ! హుషారీమే దర్యాప్తు చేసి మోహినీబాయి సమాచార్ అవుర్ దగాఖోర్ జయసింగ్ పరారీకూపీ చమత్కార్మే పైకితీసినామ్.

మాన—ఎక్కడ? ఎందున్నారు?

సలీం—బోలోరే గులాం! బోలో!

గులాం—అచ్ఛాసర్కార్! ఖల్ రాత్కా ఖానీకామె ఖిల్లాఖాలీనేసి ఖందక్మే ఖాళీగుడ్కే యళ్ళినార్ యిన్నామ్. సర్కార్.

సాగ—చి త్తగించి వారా! మన మూహించి నట్లే.

మాన—సరే! అయియుండవచ్చును. నీ కీసమాచార మెవరుచెప్పినారు?

గులా—మాకీ యీరెండు నేత్రాల్ ప్యాయమ్ సూస్నార్ సర్కార్. ఖల్ ఫూల్ బాగ్ మే జయసింగ్ మోహినీబాయ్ దోనోబీ ఖానీకామే బడే కమామిష్ సేస్తూవుంటే సెట్టూమీదనుండి యిన్నామ్ సర్కార్. జూటీబాత్ బోలేతో జూతీసే మార్ మహారాజ్!

మాన—సరే! మేమిప్పుడే ఆసురంగమార్గమునం బోయి నిజ మెఱింగివత్తుము.

సలీం—మామాజీ! మాకీ రావాల్నీ హుద్దేసం ముఖ్యంగా వున్నాది.

మాన—కుమారా! వద్దు. వద్దు. అందొకవేళ శత్రుసైన్యములుండిన నుండవచ్చును. లేదా, మోస మేనియుంగావచ్చును. భవిష్యత్సార్వభౌముండవగు నిన్నట్టి ప్రమాదస్థలమునకుం దోడ్కొని పోరాదు. మిత్రులూ! సాగరజీ! ఆయుధపాణులయి మీరు నావెంటరండు!

సలీం—మామాజీ! జయసింగ్ కీ జేడీల్ యేసి మోహినీబాయికీ మేనాపర్ యేసి హావమ్యం పట్కారావాల.

మాన—సరే! వారచ్చట నున్నచో నట్లే చేయవచ్చును. మీరుమాత్రము శిబిరమున మిగుల భద్రము. (సాగరజీతోం గలసి నిష్క్రమించును.)

సలీం—అచ్ఛా! అరే! గులాం. దారూ జరూర్నేలే ఆవు.

(ఇరువురును త్రాగుచుండగాం దెరవాలును.)

## 4. రంగము—కాళికాదేవ్యాలయము.

[మోహినీబాయి తదేకచిత్తముతో విగ్రహము నెదుట ధ్యానించుచు మోకరించి యుండును.]

మోహి—భుజంగ. భవానీ! మృడానీ! శివా! నీలవేణీ!
భువినన్నీవె దిక్కంటిం బోషింపు మా న్
ప్రవాళాధరీ! నన్ గృపం జూచు నా శౌ
రు! వేగావ రావే! సరోజాక్షి దేవీ!

ఓ కాత్యాయనీ ! ఆర్తజనాభయప్రదాయినీ ! సదా త్వదీయపదారవిందంబులే మదీయ హృదయ మందిరమునందుం బొందుపఱిచి నిఖిలప్రపంచమున్మఱచి నీవే సర్వమ్మని నమ్మికొనియున్న దాన. కడుదీన. మతిహీన. నడిసముద్రములోని పడవ వడుపున సుడిగాలి కడగం ద్లేదిక్కునకీడ్చిన నాదిక్కునం బోవుచు నేగడియనో దరిగానరాని యీవిచారంపు గడలిం గడువనేరక దీని కడుపునం బుడుంగునంబడి యడుగంటనున్న దాన. చిన్నప్పుడే కన్నతల్లి కఱవైపోయె. కన్నతండ్రి దయావిహీనమానసుండయి మానాభిమానములు పోనాడి కుక్షింభరత్వముచేఁ గన్నకూఁతురని యించుకేని సంకోచింపక కులభ్రష్టంజేయ నుద్యుక్తుండయి యున్నవాఁడు. పుట్టిననాటం గోలె కన్న సంతానముకన్న మిన్నగా నెన్నికొనుచు నెండకన్నెన్నఁడేని నెఱుంగనీయక కన్నులనద్దుకొనుచుఁ గంటిఱెప్పవలెఁగాపాడు మాతామహుండు, మహనీయసదాచారపరాయణుండు మాయదారిమిత్తి వాతంబడి మటుమాయమైపోయె. కన్నవారికిని బెంచినవారికింగాక యేకాకినై వీకదక్కి తమోమయంబై సర్వశూన్యంబగు నీలోకమున దారి తెన్నులు గానరాకూరక పరిభ్రమించుచున్నదాన. ఓజగజ్జననీ ! జగదేకరక్షిణీ ! ఆర్తజనాపన్నివారిణీ ! దుష్టసంహారిణీ ! నాయవస్థంగని కనికరింపుము. కరుణింపుము.

అర్చకుఁడు—(తొందరగాఁ బ్రవేశించి) రాజపుత్రీ ! మీతండ్రిగారగు సాగరజీయును జయపురాధీశ్వరులగు మానసింగుగారును లోనికివచ్చుచున్నారు. ఏమిసెలవు ?

మోహి—ఇఁక సెలవేమి ? నాకడపటిగడియలు సమీపించినట్లున్నవి. అయ్యో ! సమయమున రాజయసింహ కుమారుండును లేకపోయెను. కోటలోని పూఁదోఁటలో దాదాగారిచ్చిన లోహపేటిక పఱిచివచ్చుటచేఁ దిరిగి దానిఁ దెచ్చుటకచోటికిఁ బోయియుండెను. పోనీ ! నామాటకేమి ? దారిలో నాతనికేమియు నపాయము రాకుండిన నాకదియేపదివేలు !

శా. దేవీ! పావనరూపిణీ! భగవతీ! దేదీప్యమానప్రభా
వా! విశ్వాత్మకదేహినీ! శరణు నీపాదాఁబుజాతంబులే
నావిజ్ఞాపన మాలకించి కృపల న్నామావశిష్టంబుగా
గావింపం గదె భక్తవత్సల జగత్కల్యాణి కాత్యాయనీ!. 84

(మోకరించి తదేకచిత్తయై ధ్యానించుచుండ సాగరజీమానసింహులు ప్రవేశింతురు.)

మాన—మిత్రమా ! దేవీవిగ్రహము నెదుట మోకరించి తదేకదీక్ష ధ్యానించు నామిం చుబోణియే మీకుమారీరత్నముకాఁబోలు ! అహా ! ఏమి యామె దైవభక్తి ! మీ కన్నియ చక్కఁదనముల కెక్కయేగాదు. గుణాఁకుప్పవలెఁగూడ నున్నది.

గీ. రాజ! యిటువంటి పుత్రికారత్నములను
పొసఁగ వారసమె రత్నాకరుఁడను
నర్థ మిచ్చెను నాగరాహ్వయము మీరుఁ
బెట్టినారేమొ మీవారు పుట్టినపుడె. 85

సాగర — ఆర్యా! ఇది కేవలము కవితాబద్ధమగు ప్రశంస. మాకుటుంబమునం గాప్రేముండియుఁ దమకుఁగల వాత్సల్యముచే నట్లందురుగాని మేమేపాటివారము!

మాన — మిత్రమా! ప్రశంసకుఁ గాదుగాని మీపుత్రిక సర్వోత్కృష్టచరిత్రవలె నాకుం గనుపట్టుచున్నది. మంచిరూపవతి; తదనుగుణ్యమగు గుణవతి, వివేకవతి, వినయవతియునై యుండఁబోలు. ముందుగా మీరుకన్నడి పుత్రికాస్నేహమునఁ బ్రసంగించి యెట్లయిన నిచ్చోటువాసి యుదయపురమునకుఁ దోడ్కొని చను బందోబస్తు చేయుఁడు. ఇందు బహిరంగముగా నేను జోక్యము కలుగఁజేసికొనుట యతిక్రాంతమర్యాదగా నుండును. జయసింహుఁ డిప్పుడిందు లేనట్లున్నది. అతఁడిప్పు డెక్కడికిఁ బోయినదియు నెందున్నదియు విస్పష్టముగా కనుంగొనవలయు. నే నిందే యుండెద. మీ కసాధ్యమైనచో నేనువత్తును. మతిపోందు పనిపండించుకొనిరండు.

సాగర — చిత్తము. మనచేతిలోనిపని. సాధించుటకేమికష్టము! వెఱపు తెరువులు నాలుగుకదా! మొదటిమూఁడు నిరర్థకములైన తురీయోపాయ ముండనే యున్నది.

మానం — గోటం జిదుగుఁదగువానికి గొడ్డండ్లేల? పోయిరండు. నేనిందే యుండెద.

సాగర — (పోయి దేవీగృహము నెదుట మోకరించియున్న మోహినిని సమీపించి) బిడ్డా! ఇక్కడనా యుంటివి! అక్కటా! ఇంతదిక్కుమాలి యుండ నీకేమి కర్మమమ్మా. లెమ్ము. మనయింటికి పోదమురమ్ము.

మోహి — అయ్యా! నాదిక్కునకు రాకుఁడు. నా కీలోకములో నెవ్వరును లేరు. లోకులతో నాకు జోక్యములేదు.

సాగ — అదేమమ్మా! అట్లనెదవు నీమనసు సరిగానున్నట్లులేదు. ఆపదలపై నాపదలువచ్చుటచేఁ గాఁబోలు మది బెదరి చెదరిపోయినది. మోహినీ! మది కుదురుపఱచుకొనుము. నేను నీతండ్రిని. మనయింటికి పోదమురమ్ము.

మోహి — నాకుఁ దండ్రియును లేఁడు తల్లియులేదు. భక్తజనకల్పవల్లియగు నీసతీమతల్లియే నాతల్లి. ఇతరులెవ్వరును నాకుఁ గారు. నేనితరులకుఁ గాను. కరుణించి

మీదారిని మీరుపొండు. మీరెవ్వరో దేశద్రోహులవలె నున్నారు. మిమ్ము చూడ నాకుభయము- కాదు- అసహ్యముగా నున్నది. అదిగో మ్లేచ్ఛశార్దూలముల నాశ్రయించుకొన్న తోఁడేలు ఆపదను పొంచియున్నది. దానిమొంగిలిడిను నీదుమ్ములకంను నాకుఁ దండ్రియుఁట. ముందుగా పసిఁబట్టుటకిక్కడికి బంపఁబడినది. దుష్టసత్త్వములారా! పొండు! పొండు! తెలియదా ఇది మృగేంద్రవాహన యుండుచోటు. మీయాట లిచ్చోటసాగవు.

సాగర—ఆర్యా! మానసింహా! ఇటురండు. ఈమె చిత్తము స్వస్థముగనున్నట్లులేదు.

మాన—(సమీపించి) ఇవియన్నియు వేషములు. మీరూరకుండుఁడు. నిమిషములో నేఁ జక్కఁజేసెదను. (మోహినితో) ఓ రాజపుత్రీ! ఇట్టిపిచ్చివేషములవలనఁ బ్రయోజనములేదు. నీతో నొక రాజద్రోహి యరుదెంచెనఁట. ఆతఁ డెందున్నాఁడో చెప్పుము. లేకున్న నీకుఁ బ్రమాదించును.

మోహి—రాజద్రోహియా! దేశద్రోహులు, వంశద్రోహులు, స్వామిద్రోహులు, భ్రాతృద్రోహులు, లోకములో మీకు మించిన ద్రోహులీప్రపంచమునందు, కాదీములోకములందును లేరు. పొండు, పొండు. మీరుతప్ప మఱియెట్టిద్రోహు లిప్పట్టునలేరు.

మాన—ఓనంగనాచీ! దొంగవేషములుమాని గజదొంగయు రాజద్రోహియును దుర్గదాసుఁడును నగు జయసింగెందులేఁడా! చప్పునఁ జెప్పుము. లేనిచో నాతని తప్పు నీమాపుగంబడి నీకు ముప్పుఁదెచ్చిపెట్టును.

మోహి—అయ్యా! నీవేనా మానసింగవు? మీసోదరియే కామా పామసాష్ట్రపదేం! పాపము! మీచిన్నిమేనల్లుని యాటసామానే కాఁబోలు, షోలాపురినుండి వచ్చుచుండఁగా దొంగలెత్తుకొనిపోయిరి. ఆదొంగతనమూ యిప్పుడు జయసింహునియం దారోపించుచున్నావు?

మాన—వగలాఁడీ! అధికప్రసంగముమాని జయసిం గెందున్నాఁడో చూపుము.

మోహి—ఓహో! మీకు జయసింహుఁ జూపింప వలయునా!

మ. జయసింహుం గనిపింపఁగా వలయునా? జాడే నెఱింగింప ని
ర్భయులై పట్టఁగలారె! మెచ్చఁదగు; సేబాష్! యోధులే! పైకర
ద్వయముం బట్టి యొసంగు మేమటుపయిన్ బాధింపఁగా నేర్తుముం
చయయో! పల్కెదరేమొ! నాకలవియౌనా! అంచుదానంగదా!

మాన—అబలవుగదా యని మిన్నకుండిన కొలందిని నీవతిక్రాంతయస్యావ వసుచుంటివే.

వినుచుంటివా! జయసింహుఁడు రాజద్రోహి. దుర్గదాహకుఁడు. ఆత
యిక్కవలెఁజెంగియు నిక్కఁడును మఱుంగుపఱచిన నీకు మరణదండన తప్పదు
మోహి—అయ్యో! నన్ను చంపివేయుదునని భయపెట్టుచుంటివా! నీవు రసపుత్రవం
శసంజాతుఁడవేనా? రసపుత్రులకు చావోకభయకారణమా! నీకు మరణ
మన్న నంతభయమా? ప్రాణమన్న నంతతీపియా! ఓరిమానహీనుఁడా!

సీ. మానంపురమకు జన్మస్థాన మౌ దేశ
మాతను శత్రుకను మనుపుకన్న
తోఁడఁబుట్టువులఁ గూఁతుల బజారునఁబెట్టి
కులవిహీనుల కమ్ముకొనుటకన్న
గోమాంసమును మద్య మామోదమునఁ దిను
మ్లేచ్ఛపంక్తిని విందు మెసపుకన్న
అడియాసలను జెంచి యన్నఁదమ్ములఁ జీల్చి
కూటికై యితరులఁ గొలుచుకన్న
తే. గీ. మరణమే కష్టతర మని మదిఁ దలఁచితె
ఉట్టికట్టుక యూగుదే యుర్విమీఁద
నిట్టిబెదరింపులం గట్టిపెట్టు మొకట
మాన మేదిర నీకు దుర్మానసింగ! 87

[తెరలో జయసింహుఁడు]

చ. నళిన పు నెజ్జ భద్రమని నమ్మిసుఖంబున నున్నహంసికా!
మెకువతో మెలఁగు మిఁక మ్లేచ్ఛని వేల్పు, కళంకుఁడున్ ద్విజా
తులపగవాఁడు, దేశికవధూవ్రతభంగరతుండు, సోదరీ
నిలయముఁగూల్చు రాజిటకు నేర్పునవచ్చెఁ జలింపకుండుమా.

మాన—(విని) అదిగో! రాజద్రోహి జయసింహునిమాట వినవచ్చుచున్నది. నేఁబోయి వానిబంధించి ప్రాణముతో ఢిల్లీకిఁ గొంపోవలయును. మీరన్నట్లులీమెకు చిత్తచాంచల్యమే కలిగినది. లేకున్న నిట్టిప్రేలాపనపట్టదు. ఈమె నెట్లయినను వనము ప్రస్తుత మదయపురమునకుం గొఁపోయి తగిన చికిత్సఁ జేయింపవల

యుండును. ఇంతలో నే నీ జయసింహుని హతమార్చివచ్చెదను. జాగ్రత్త.

[నిష్క్రమింపఁ దెగఁజూడఁగా ముందునుండి జయసింహ మానసింహులు చెరియొకవైపునను బ్రవేశింతురు.]

జయ—ఓరీ! మానసింహా! యుద్ధకార్యములో నీచాకచక్యమింతియేనా?

చ. నిలువెడులోఁతు గర్తముల నిల్చి తుపాకుల పూాతులించుకే
వెలి కగుపించ కుప్పమయి పేల్చుట పోరఁటరా! దూరంబునం
జిలువము బలమ్ము తెల్లముగఁ జేసెయిఁ గల్పి ముఖాముఖిందమిం
దలపడి పోరి గెల్చికొనఁగన్, గనఁనౌ నిజదర్ప మప్పుడున్. 89

మాన—దారిదోపుఁడవగు నీతోఁ జేఁ జేసికొని యుద్ధముచేయుటయే మావంటి వీరులకుఁ బరువుతక్కువ. ఇదిగో నీదర్జాకుఁ దగిన వారినిం బంపెద నుండుము. (బిగు లూదును.)

జయ—ఎవరిని? మేనల్లునింగాఁబోలు. ఓరీ పిరికిపందా! ఇంతమాత్రమున నిన్ను విడిచి ఫ్రత్తుననుకొంటివా?

చ. నిలు! నిలు! పోకు! పోకు! మిఁక నీచపుటీ ధృతిమాలి, చాలనాఁ
కలిఁగొనె నాదవాలు చిరకాలము నుండియు రాజపుత్ర మో
గలకుల రక్తమాంసముల ఖాదన మబ్బక; రమ్ము! కీల్ ఫిరం
గుల మునిముందు నిల్పుకొని కోటలు మీటుటయా రణంబనన్.

మాన—మీయోధుల కట్టి యుద్ధసాధనములు లేమిఁజేసి యభావమునందు నీకట్టి విరక్తిం జూపుచున్నావు. సమయమునకుఁ గేలనుండి వాలు జారిపోయినది. లేకున్న నీపాటికంఠము మొండెమునుండి వెడలి నీకట్టి యుత్కంఠోక్తులాడనేరకయే యుండును.

జయ—ఏమి! కేలనుండి వాలుజారినదా! సరే! అవకాశమిచ్చితిని. పౌరుషముకలదేని క్రమ్మఱ వాలుంగొని శస్త్రయుద్ధమునకుం గడంగుము.

మాన—నీవు నిజమైన రసపుత్రుఁడవేని యిక్కడనే నిలువుము. నీకుత్తుకఁగోసి నెత్తురు ద్రావు వేఱొక్క కత్తిందెచ్చి నీయుక్కడగించెద.

జయ—ఓహో! ఇట్టులైన నెచ్చరికమ్ము. నీవు వచ్చునంతకు నేనిచ్చోట వాయనలే

మాన—వగవాఁడవైన నిచ్చటనుండి కాలుకదల్పఁగూడదు సుమీ! (పోవును.)

జయ—అయ్యో! నేబుద్ధిమాలినపని చేసితినే మోగదా! ఈదేశద్రోహియెడ యుద్ధనీతి నాలోచించితిని.

మాన—(తిరిగివచ్చి యుద్ధమునకు సిద్ధపడుచున్నట్లెదురుగా నిలఁబడ నిద్దఱు సిద్దీలు వెనుకనుండివచ్చి జయసింహుని బంధింతురు.)

జయ—హా! ద్రోహీ! ఆఁడుదానిపని చేసితివిరా!

మాన—(సిద్దీలతో) కదలకుండునట్లు కాలుచేతులు గొలుసులకట్టి పెట్టుఁడు.

జయ—ఛీ! ఛీ! ఆఁడుదానిపని చేసితివిరా, రసపుత్త్రకులకళంక!

ఉ. కైపున చేయిజాఱి కడఁ గాఁ బ్రజ గేలను వా లమర్చుకోఁ
గా దయసేయుమొక్కటి కాల రక్షావధి నంచు వేఁడ సి
పై దయఁజూపకట్టిపస పాసము నాక యొనర్పఁ బూనినా
నా! దురితాత్మ రక్షకుని ఘాతుకుణసేయుట నీకువృత్తమా! 91

మాన—పోరా! పిరికిరీ! ఇట్టి శ్రీరంగనీతులే నీయట్టివారి కిట్టియవస్థలోఁ బట్టుగొమ్మలు. (సిద్దీలతో) ఓరీ! మీ రీరాజద్రోహిని మిక్కిలి భద్రముగాఁ గొంపోయి మాయుత్తరువులు వచ్చువఱకు నదయపుర కారాగారమున బంధింపుఁడు. పొండు. జాగ్రత్త!

(నిష్క్రమింపఁ దొడఁగుదురు.)



౫. రంగము—కమల్ మియరు రత్నపురికోటకు మధ్యమార్గము.

[యవనయోధులు లోకయేటివంతెనను దాఁటుచుండఁగా పృథ్వీరాజు నిజబలమును హెచ్చరించుచుఁ బ్రవేశించును.]

పృథ్వీ—ఏమిచెప్పుమా! మా రసపుత్త్రచమూసమూహంబు వితిగి పరాభూతమగుచున్నట్టు గన్పట్టుచున్నది. ఓహో! రసపుత్త్రయోధులారా!

చ. మరణము నాజమెంచ నొకమాటె ఘటిల్లును జంతుకోటికిన్
తరుణమునందుఁ దప్పినను దప్పని యొప్పని కైకొని, పాటిమీరా
చిరతరకీర్తుల న్మనగఁ జేయఁడు రాజసపుత్త్రులార! సం
గరభువి బ్రుంగిన న్యశము గాంతురు పాటిలఁ జావుతప్పునే. 92

[అంత ప్రతాపపుత్రుఁడగు నమరసింహుఁడు పరగునవచ్చి]

అమర—బాబాజీ సర్కార్! అల్లదే విరోధివరూధినీయూథం బొక్క పెట్టున నాన దీగర్భంబునం గూలఁబడినట్లున్నది. ఇటు చిత్తగింపుఁడు!

చ. పురుషకృతంబొ దైవకృతమో కనుఁడల్లదె! కీలువం తెఱఁగ
మఱి సడలంగ నేటఁబడి మగ్గ రిపువ్రజ మొక్కపెట్టునన్
గరముల నున్నకైదువులు గాత్రములం గవచంబు లున్నవున్నవ
ట్లొరగిరి నీటిలో యవనయోధులు సాయుధవాహనాధ్యులై. 93

ప్రతా—కుమారా! అది శత్రుసైన్యమగుట నిశ్చయమేగదా!

అమర—అందునకు సందేహమేమి? తిలకించిరా!

క. నెలవంకయు రిక్కయుఁగల
తెలిజెండా యెగురుచునదిగో! దీన్ దీనను కే
కలుఁ బాశ్చాత్యశతఘ్నుల
యులివులు వినలేదె! యవనయోధులు గారే! 94

ప్రతా—అంతవట్టునకు నిశ్చయమే కాని విరోధుల వంచింప మనవారు నొక్కొక్కప్పు డిట్టికృత్రిమచిహ్నములను ధరించుట కలదు.

అమర—అగుఁగాని మనవారు ప్రాణముపోయినను గేవల రాక్షసోచితములగు విష వాయుక్ష్వేళ నాళీకాస్త్రములను శతఘ్నులను ప్రయోగింప నంగీకరింపరు. అది పురాతనయుద్ధనీతికి విరుద్ధమఁట.

ప్రతా—సరియే! నీయూహ నిశ్చయమే కావచ్చును!

అమర—బాబాజీ సర్కార్! నాదొక చిన్నసంశయమున్నది.

చ. జలముల గాలిలోఁ జదల సంగరమాఁ గనరానిభూతముల్
కలఁబడి పోరుసల్పఁ గలకాలమువచ్చు నటంచు నెవ్వరో
పలికిరి మున్న పూర్వపు నిబంధనలం గొనఁగొత్తపద్ధతిఁ
దలపడు శత్రుఁగెల్చుటెటు? ధర్మము కాలముఁ బట్టిమాఱదే. 95

ప్రతా—అవును. రాజులంబట్టి ధర్మము మాఱుచుండును. కాలముంబట్టి రాజు ప్రవర్తింపవలయును. ఇట్టి విపమావస్థలం దనుష్ఠించుటకుఁ గొన్ని ధర్మసూక్ష్మములు పూర్వశాస్త్రములయందే గలవు. మాటువరుసకు దయ యందఱిమానవులకు

కుండవలసిన సామాన్యధర్మముగదా! అట్లు యుద్ధభూమిలో నొకయోధుఁడు తనచేఁజిక్కిన శత్రునియెడ దయఁజూపి విడిచిపెట్టవచ్చునా.

అమర—ఎంతమాత్రము విడిచిపెట్టరాదు. అదియేమి? బాణభట్టారకా! క్రొత్తవార్తలను వినిపింప వచ్చుచున్నట్లున్నది.

బాణ—(ప్రవేశించి)

చ. కటకట! మిత్రమా! ఖలుఁడు కాళ్ళపయింబడె నంచు నేలయు
క్కటికముఁజూపి ప్రోచితివి? కాలభుజంగము వాఁడు కాఁటువే
యుట కెదలంచు; ప్రాణముల నోమిన వీరణధర్మ మెంచెనే
కుటిలమతిన్ వధించి తరుకొంటివి వింతగురంత మింతలో. (౯)

అట్టి దుష్టబుద్ధిపట్టునను సనాతనరణధర్మము లోచించుట! అయ్యో! చేఁజిక్కిన దేశద్రోహిని విడిచిపెట్టి యెంతకట్టిపొరపాటు చేసితివోయి!

అమర—కవిశిరోమణీ! వార్తలేమి? ఎవనిఁగూర్చి మీ రట్లువిచారించుచుంటిరి?

బాణ—అయ్యో! మనజయసింహునిమాటయే. చేతఁజిక్కిన మానసింగుని విడిచిపెట్టి మీఁదుమిక్కిలి ఆ దుష్టుఁడు చేసిన మాయోపాయముచే నుదయపుర కారాగారమున నిప్పుడు ప్రాంతకాఁపై యున్నాఁడఁట.

ప్రతా—ఏమీ! జయసింహుఁడేనా? ఎట్లు? మోహినియేమైనది?

బాణ—ఇదిగో! అతఁ డుదయపురమునుండి తనపెంపుడు పారావతముచేఁ బంపిన స్వహస్తలిఖితమగు నీయుత్తరము దిలకించిన యావద్వృత్తాంతము స్పష్టమగును.

ప్రతా—(పుచ్చుకొని చదివి నిట్టూర్పుపుచ్చి) ఆహా! ఇట్టివంచన మునుపు పుట్టినవారిలోఁగాని యింకముందు పుట్టఁబోవువారిలోఁగాని యుండఁబోదు. సరి సె దైవమున్నాఁడు. కాని మిత్రమా! బాణభట్టారకా! ఇందుఁ దుదిని లిఖింపఁబడిన గుప్తపేటికావృత్తాంతము సాంతముగాఁ జదివి చూడుము. (ఉత్తరమిచ్చును.)

బాణ—(చదివి వూరి) కులవృద్ధగురుణమస్ల్లు శాసనము చున కతిక్రమింపరానిది. ఆ పేటికయం దేదియో యమూల్యవస్తు వుండఁబోలును.

ప్రతా—అమూల్యము కానీ! కాకపోనీ! అతనిశాసనమే మనకమూల్యము. కావున మనమిప్పుడే తదీయదేవాలయమునకుఁబోయి యక్కడ నిక్షేపింపఁబడి యను పేటికందీసి యుదయపురమును సాధింప నేఁడే దాఁడివెడలవలయును. ఇప్పటికి మనవశమైన కమల్ మియర్ గోగుండా మొదలగు దుర్గములను భద్రముగా

రక్షించుటకుఁ దగినయేర్పాట్లు చేయవలయును. అన్నట్లు చెప్పుచుంటిని. మన రసపుత్రదండనాయకు లందఱు దండయాత్రకుముందు ప్రచండరిపుకాండ ఖండన దోర్దండయగు నా చండికామాతయందును ఈ నాశాసనమతిక్రమింపమని శపథము చేసి మఱియు జైత్రయాత్రకు బయలుదేఱవలయును.

సీ. క్ష్మాభర్తయేనియు గడ్డిమెత్తనగాని
మృగత్వమునఁ బవ్వళింపఁ జనదు;
పుట్టుభోగము నేలఁ బూరియుంటనెగాని
శ్రేష్ఠహర్మ్యమున వసింపఁ జనదు;
కోటీశుఁడైన మానులవిస్తరినెగాని
హేమపాత్రను భుజియింపఁ జనదు;
దర్పోద్ధతుఁడును గ్రిందుగ దువ్వుగాని
క్రొవ్విన మీసము లెగదువ్వఁ జనదు;
గీ. మగటిమికిఁ బుట్టినిల్లయి మనఁగఁగన్న
తల్లి మేవాడ కనుపువం దగసిచిచ్చుఁ
బెట్టుచున్నట్టి శత్రుల పేరుమాపి
తిరిగి చిత్తూరుకోట సాధించువఱకు 97

ఇదే మదీయశాసనము! మనయోధుల కందఱికిం దెలియఁజేయుము.

(అందఱు నిష్క్రమింపఁ దెఱవాలును.)





శ్రీ

# రాజపుత్ర తేజఃపుంజము

(రాణా ప్రతాప్ సింగ్)

## పంచమాంకము.

1. రంగము — ఉదయపురదుర్గము నందలి మైదానము.

[ప్రతాపసోదరియగు కమలాబాయి చిత్రకారిణీవేషమునఁ గొన్ని పటములతోడను చిత్రలేఖనసామగ్రితోడను ప్రవేశించును.]

కమలా — పటములమ్మా పటములు! చక్కదనాల పటములు! ముద్దుముద్దుపటములు ! ముద్దుగారుపటములు ! * * * * * * *

(తనలో) ప్రస్తుతము కోటలోఁ బ్రవేశించుటకు నాకీవేషమే తగియున్నది. బాణభట్టు నాతోఁ జెప్పినమాటలే యిందన్నిచోటుల వినవచ్చుచున్నవి. ఒక్క మోహిని నేకాదఁట; జయసింహునిగూడ బంధించి యిందుకొనితెచ్చిరఁట. సరే దుర్గముసమీపించితినిగదా! ఈవేషమున నిందుఁజొచ్చి నేర్పుమై వచ్చిన పని సాధింపవలయు. (కొంచెము పరిక్రమించి) ఆహా! ఇది మాయుదయపురపుఁ గోటయేనా, ఆచూపట్టునదియేనా, ఉదయసాగరము! ఇప్పుడు నేనడచుచున్న వేనా చిన్ననాఁడు మే మాటపాటల వినోదించిన ప్రియదావనవాటికలు! ఆముచ్చటలును ముఱిపెములును నిప్పుడు కలలైపోయినవిగదా!

సీ. వఱలు సింకను బాగ వచ్చుచున్నట్టి యీ
చోట మాగిజైనగూటి పొయ్యె,
అదె మాపికిలిందఁ దా నగరు శిథిలమయ్యెఁ
బ్రియమైన మాబొమ్మ పెండ్లిపీనె,

ఉన్నవింకను పట్టియూఁడల సందాను
లీల మేమూఁగిన డోలిక లవె,
జీర్ణింప దింతకుఁ జెఱువుగట్టున బొమ్మ
కొలువుంప వేసిన కుంజశాల,
చేడెలంగూడి విరిబంతు లాడితి మట
మదమరాళంబులకు నడ ల్నేర్పితి మిట
కాన నగు నేటికిని గను ల్గప్పినట్టు
లాటపాటలు మాచిన్ని నాటివెల్ల.

అదిగో! ఆపొగడచెట్టుక్రిందనున్న స్ఫటికశిలావేదికపై నిద్దఱు ముద్దియలు మాటలాడుచున్నట్లున్నది. వారే యొకవేళ మోహినీచంద్రికళలై యుందురేమో! ఇఁక నావేషము వినికిరిచేయవలయును. (పైకి) పటములమ్మా! పటములు! చక్కదనాల పటములు! ముద్దునుపటములు! ముద్దుగారు పటములు!

ఉ. చిత్రముల న్రచించుదును జీవకళ ల్పచరింతుఁ జిత్రపుం
బత్రములం దపూర్వమగు భావములం బ్రచురించుపట్ల నా
చిత్రము కృత్రిమంబొ నిజజీవియొ నా భ్రమియింపఁ జేయునున్
చిత్రకళాభిమానలగు చేడెలు నాపనిఁ జూచిమెచ్చఁడీ! 99

(పూర్వోక్తరీతిని మోహినీచంద్రికళలు విశ్రమించి యుందురు.)

చంద్రికళ—రాజపుత్రీ! మోహినీ! ఎప్పుడును విచారమేనా! నలుగురితోఁ గలసి మెలసి కలివిడిగానుండు నీముద్దుమొగము చూచి యానందించు భాగ్య మిఁక మాకుఁ జేకూర్పఁదలఁచుకో లేదఁటమ్మా! ముద్దుగుమ్మా!

చ. కనులకు రాణివాసమఁట కప్పెద వెప్పుడు బాష్పపూరదెరణ్
వనితరొ దృష్టిపాటునఁట వంచినయానన మెత్తవెప్పుడున్
వినవను బల్కవు న్నుడుల వీనులకుం జవిగానివారమే
మనముననున్న నీవెతలు మాకెఱిఁగించినఁ గొంచెమౌను వే.

కమలా—(దూరమునుండి తనలో) ఆ! అది తప్పక చంద్రికళయే! ఆభోగపు తోఁట యిది! ఏదీకత్తి! దీనికత్తుకను త్రెంచి తత్తునియలు చేసిఁగాని నాచిత్తము

స్పష్టపడదు. ఆదినమున- నాజీవితకాలములో మణిపురాని కుమ్రోజను అనుద్దిశ మున-నీతోత్తు నన్ను వంచించుట కెంతయు క్తిచేసినది. అమ్మాయని పిలుపులే కుండ నాగు ప్తఖడ్గముచే దీని నిప్పుడ నఱికివేసి యుందును గాని దీనిమూలమున నింకను గొన్ని రహస్యములు తెలిసికొనవలసియున్నది. మరల నేనిలా మాట లాడుచున్నది.

చంద్రి—అమ్మచెల్ల! ఉల్లాసముగా నుండరావటే! నీవెంతదిట్టరివే! నీకెంతపట్టుం దలయే! పదిం బది మేమెంతబతిమాలుకొనినను బెదరికదపిన ఫున్నెమునం బోవు! అదియేమి యపురూపమోగాని విరిబోణీ! నీపలుకే మాకు బంగారమగు చున్నది! ఉల్లాసముగా నుండవే! తల్లీ! మాకోరిక చెల్లింపవే!

మోహి—నా యుల్లాసమెచ్చటనుండి వచ్చును!

ఉ. పుట్టితి నీయిం న్నొకటం బొందఁగనీవని ఘోరపట్టికన్
గిట్టనివానికై వడి లిఖించె విరించి సృజించినప్పుడే
బిట్టువిచార మిట్లనుభవించుటె నాపని మీర లూరకే
తిట్టిన నేమి లాభమగు దిట్టరినే గను మొండికట్టెనే 101

చంద్రి—అబ్బా! ఎంతనిస్పృహత్వము! బిడ్డా! నీవిచారముపోవు నుపాయము చెప్పెద వినుము.

మోహి—అది మీవలనఁగాదు.

చంద్రి—మావల్లననఁగా స్త్రీజాతివలన నని నీయుద్దేశము కాంబోలు. పోనీ! మావల్లఁ గాకున్న నీకొఱకు వల్లనగువారి కాళ్ళనే పట్టుకొందుములే.

మోహి—అది మనుష్యమాత్రులవలనఁగాదు.

చంద్రి—ఓహో! అల్లా! ఒకవేళ నీవిచారము మేమే పోఁగొట్టఁగలిగినదో!

మోహి—మీరస్తు లతిమానుషములే!

చంద్రి—ఒప్పుకొందువా?

మోహి—ఓ! తప్పక.

చంద్రి—సరే! ఎప్పుడో యొకప్పుడు; ఇప్పుడన్న నిప్పుడు కాదు సుమా నీదుఃఖము పోఁగొట్టుట మాపని. అదియేమి? జయసింహుఁడిటువచ్చుచున్నాడు! కారా గృహమునుండి యెవరువిడిపించిరి చెప్పుమా!

మోహి—(వికసితముఖియై) ఎక్కడ? ఏవైపున?

చంద్రి—మాంచితివా! ఎంతలో వింతమార్పు నీమొగమునందుఁ గన్పట్టినదో! ఈ నిమేషమున నీస్వాంతమున నిసుమంతయైన వంతయున్నదని యెంతటిబుద్ధిమంతుఁడైనఁ జెప్పఁగలఁడా!

మోహి—సరే! బాగున్నది! మీ కెక్కసక్కెము లాడుట కమ్మరుఁ జిక్కిన మేఁకను నేనొక్కతె నిక్కడఁ జిక్కితిని. మిమ్మనం బనియేమి?

చంద్రి—ఎక్కసక్కెములు కావమ్మా! అదిగో చూడుము. ఎవ్వరో వచ్చుచున్నారు దూరముగా నుండుటచే పోలికపట్టనేరక జయసింహుఁడనుకొంటిని. నామాట బూటకమేమో అటుచూడుము! వారిటే వచ్చుచున్నారు.

[అంత కమలాబాయి ప్రవేశించును.]

కమలా—(తనలో) వీరు తప్పక మోహినీచంద్రికలే. సమీపించి వీరితో నెల్లఁగా స్నేహముచేసెదను. వారిప్పుడు నావైపుననే చూచుచున్నారు. ఇఁక నా వేషము వినికిరిచేయవలయును.

మ. కొనరండో! కొనరండు సుందరులు! కోకొండ దద్భుతా లద్భుతా
లనుగొన్నట్టివె కల్కి రేమూనట్టులుండం గానాబడును, బల్కరిం
చిన మాటాడెడు నట్లు తోచునవి యా చిత్రాల చిత్రాలు ను
ద్భుతమై యొక్కరి మేము కొనుడు మహావద్భు న్నచ్చుగు న్నట్టిచో.

చంద్రి—ఎవరమ్మా నీవు! ఏమి విక్రయించుచున్నావు?

కమలా—పటములమ్మా! పటములు! ముద్దినుసుపటములు! ముద్దుగారుపటములు! నేనొక క్షత్రియపుత్రిని; చిత్రలేఖనము నాయభిమాన విద్య!

చంద్రి—ఇటురమ్మా! కూర్చుండుము! ఏవీ! నీయొద్దనున్న పటములు! మంచి మంచివి తీసి చూపుము. కృష్ణుని బాలక్రీడలు, జలక్రీడలు, రాసక్రీడలు, గోపికా వస్త్రాపహరణము, కాళీయమర్దనము.

కమలా—ఉన్నవి. కాని మీబోటివారుంపించఁ దగినవి యంతకన్న మంచివి గలవు.

మోహి—రసపుత్రపౌరుషమును దెలుపు చిత్రఫలకము లేమేనియుంగలవా?

కమలా—లేకేమి? లెక్కలేనన్ని గలవు! చిత్తగింపుఁడు.

సీ. ఉంచుఁడీ దీని సంయుక్త పృథ్వీరాజు
ఘోరిపైఁ బడిదండ వైచుపటము,

కలముఁ గుంచెయుఁ గొని యరగడియ మాకు
మోహినిని వ్రాసితివి జగన్మోహనముగ. 105

సుందరీ! నీ చిత్రకళాకౌశల్యమెంతయుఁ బ్రశంసనీయము. కాని నాదొక్క కోరిక కలదు. మా రాజకుమారి చిరకాలమునుండి దురంతచింతాకులస్వాంతయై యున్నది. ఆమె చిత్తము రంజింపఁజేయుటకై నీవు వేఱొకరి చిత్తరు విందుఁ బొందుపఱచినంగాని యిది పూర్తి కానేరదు.

కమలా—ఎవరి చిత్తరు విందు హత్తింపనగును?

చంద్రి—ఎఱుఁగుదువుగదా! సాళుంబ్రాధీశ్వరుండగు జయసింహకుమారుని. ఆకుమారవీరుని యాకారము లేక యీ చిత్తరు వీమె చిత్తము నాకర్షింపఁజాలదు.

మోహి—చాలు! చాలు! అవి నిశ్చయముగా మీ మనస్సులందలి కోరికలు.

కమలా—నొచ్చుకొనకుండమ్మా! హాస్యమాడినంతమాత్రనే యాగ్రహింతురా?

చంద్రి—ఔవిదా! హాస్యమునకుఁ గాదు. మీ రాజయసింహు నెప్పుడైనఁ జూచి యుంటిరా?

కమలా—చూడకపోవుటేమి? ఆతఁడు రసపుత్రవీరకంఠీరవుఁడగు జయమల్లుని పుత్త్రుఁడు. మా బంధువర్గములోనివాఁడు. ఇదే చిత్తగింపుఁడు. ఆతని చిత్తరువుగూడ ప్రస్తుతము నాయొద్దనున్నది.

చంద్రి—నాకెప్పుడు నాతనిఁ జూచుభాగ్యము లభింపలేదు. చక్కనివారిలో నెల్ల చక్కనివాఁడనియు, మగటిమికిఁ బుట్టినిల్లనియుం జెప్పుకొందురు. అయినను చూపుఁడు. చిరపరిచయము గలదగుట మా మోహినియే విమర్శింపఁగలదు.

కమలా—ఇదే తిలకింపుఁడు. ఇదివఱకు చూడకున్నను లోచనపర్వముగ నీ విగ్రహముం జూచి యభినందింపుఁడు.

చంద్రి—(చూచి యాశ్చర్యముతో) ఆహా! ఎంతచక్కని యందకాఁడు. బ్రహ్మసృష్టిలో నిట్టి సర్వాంగసౌష్ఠవాకారులున్నారా యనిపించుచున్నది. బిడ్డా! మోహినీ! రావే! చూడవే!

మోహి—(చూచియుఁ జూడనట్లు చూచి చంద్రికయం దసూయాభావము సూచించుచు.)

చంద్రి—ఆహా! ఏమి యీ యద్వితీయసౌందర్యము!

శా. ఆకర్ణాంతదృగంతముల్ కనులు కార్యాసక్తి సూచించు న
స్తోకంబైన విశాలఫాల మెఱిఁగించు న్బుద్ధి సంసిద్ధి దో

